శ్రీ ఆత్మానంద విరచిత
బోధానంద శతకము

---

# ఆత్మానంద విరచిత

# బోధానంద శతకము

# శ్రీ ఆనంద విరచిత

# బ్రహ్మానంద శతకము

# పీఠిక.

శ్రీమత్సచ్చిదానంద శ్రీశృంగేరి జగద్గురు నృసింహ భారతీంద్రస్వామి కటాక్షలబ్ధ దివ్యజ్ఞానానందుఁడు. వి. వేంకటాచలశర్మయనే:—

## ఆత్మానందవిరచిత బోధానందశతకము,

ఇందులభావమును మనంబున ఘనంబుగనెంచి అనుష్ఠించు సజ్జనులకు యిహపరసుఖంబులు కరతలామలకంబులై వెలఁగుచుండు.

మదనపల్లె తాలూకా కోసవారిపల్లె, వాస్తవ్యులైన సాధుజనాగ్రగణ్యులగు గడ్డం కొండప్పగారి సహాయముచే,

కడప మూర్తి వెంకట కొండయ్యగారి స్వకీయ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి ప్రచురింపబడియె.

1918.

# శ్రీ రా మ ధ్యా న శ్లో క ము.

శ్లో॥ బ్రహ్మామృతానంద ఫలప్రదాయినం।
వేదాంతవిజ్ఞాన సుగంధపుష్పితం।
సీతాశుభాంగాంచిత బాహుశాఖినం।
శ్రీరామకల్ప ద్రుమమాశ్రయామః॥

కం॥ భజియించెద గురుచరణము।
అనవరతము నాత్మ నొందు నీసదృశభక్తిన్।
సుజనావళి సంసేవితు।
శృంగేరీపుర నివాసుమంగళచరితున్॥

చూర్ణిక॥ శ్రీ మజ్జగదఖిలసజ్జన చకోరాకానీక సాంద్రచం
ద్రచంద్రికా విరాజమాన రాకాసుధాకరశోభా
సంపద్యమానదరస్మేర ముఖాభిరామయ శ్రీమ
త్పరమేశ్వర చరణారవింద మకరందరసాస్వా
దనీ యిందిందిరాయ మానసుందరతర మనో
మందిర జగజ్జేగియ్యమాన పరమహంసా శ్రయ
వైభవ వినోదానందసంజనిత రంజిత కరుణాంత
రంగాయ గురుగుహాంతర్వర్తనీయా ...

మానవాగ్స్వామినీల సన్మాధుర్య సుధారస ఝురీ
సంపూరిత మంజులమృదువాగ్గంభీర గుంభన
పదవాక్య ప్రమాణాద్యనేకకల్యాణగుణ వితరణ
వైఖరీసమేత నియమితవాఙ్మయమ ప్రతాయ
దివ్యత్కిరీటహార కేయూరకర్ణావతంసస్థకితమణి
ఘృణిజాలకలిత దశదిగంత విశ్రాంతకీర్తిసీయ్యా
ధాళధళ్యప్రకాశ మానాష్టాపద చేలాంచితక
నక బిందుసందోహలసన్మౌక్తిక విశ్లేషలక్షిత
శాటీవిరాజితకమనీయ్య నిష్కళంక శాంతవిగ్ర
హాయ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీమత్శృంగేరీ సచ్చిదానంద శివాభినవనృసిం
హ్మభారతీంద్రాయ సద్గుణసాంద్రాయ అస్మ
దజ్ఞానధ్వాంతభాస్కరాయ అమోఘదర్శనాయ
పరమగురవేనమః॥







1. కం॥ వందనమిదె గోవిందున కం।
బోద్భవు జనకునకును కరుణానిధికిన్।
మందరధరునకు యదుకుల।
మందిరునకు నిందిరామనోహరునకున్॥

2. కం॥ విశ్వస్వరూపునకుమరి।
శాశ్వతమగుసర్వసాక్షి జగత్పతునకున్।
విశ్వోద్భవునకుమాయా।
ప్రత్యేకబ్రహ్మమైన పరమాత్మునకున్॥

3. కం॥ జగదీశానినునమ్మితి।
నగణితమగు కామితమ్ము నాకిమ్మువెస।
నగజాత వినుతనవిశము।
సుఖబోధనొసంగుమయ్యశ్రీరామయ్యా॥

4. గీ॥ యతిగణప్రాస పద్ధతులే నెరుంగ।
మతిలో నీపాద భజనంబు మరులు బెట్టి।
వితతముగ జెప్పబుద్ధి నాకిదినకతన।
కృతియొనర్పను భక్తితో నతునర్తు॥

5. కం॥ ఒప్పగునీ శుభచరితము।
విప్పుగ తెలియంగలేరు విబుధావళులున్।
చొప్పెరుగజాల జెప్పను।
తప్పకనిను మదిలో దలచి దగవచియింతున్॥

6. కం॥ పేదకు పెన్నిధి దొరికిన।
తీరున నీదివ్యనామ సంకీర్తనముల్।
శ్రీధర నాకిదె దొరికెను।
మోదముతుదముట్టె దాయె సాధురక్ష్యా॥

7. కం॥ ఖగవాహనుఅఘశోషణు।
మఖవందిత చరణయుగళు యహిరాట్ఛయనున్।
నిగమాంత వేద్యు గొల్చెద।
జగదీశున్ భక్తలోక హృదయాదీశున్॥

8. మ॥ యహిరాట్భూషణునాదదేవు,
మటినెంతున్సంతసంబొందుచున్।
మిహిరేందుగ్రకృశాననేత్రవిలస,
ధ్మాభృత్కుమారీ సద్వదనాంబోరుహా।
మిత్రనంద్రు సుజనా నంద్రైక సత్సాత్రృచ కి।
విరించిక్రమహూపులోకగురుశంభున్గొల్చె
దన్నెమ్మదిన్॥

9. కం॥ ఐదుముఖంబులదేవుని।
రెండైదక్షరములందులోలుండగు।
శ్రీఖండేందుధరునకిదెబహు।
వందనములు జేసివినుతులే నొనరింతున్॥

10. కం॥ మంగళదేవత కునుమరి।
రంగుగుశర్వాణికిపుడు శారదీవిధికిన్।
తుంగతరంబుగ మ్రొక్కెద గౌరీ।
వరతనయుడైన గణనాథునకున్॥

11. కం॥ జీవాధారుని తమతమ।
భావములో దెలియలేని భక్తులు ధరలో।
కామాదివర్గ నిచయము।
నేవిధమున విడుతురయ్య ఓ రామయ్య॥

12. కం॥ సదసద్వివేక విభవైన।
మదిదోచని మానవులకు మానదు కర్మంబు।
సుభవము గాక విడువదు।
తుది దుఃఖముగలుగజేయు ధీరునకైనన్॥

13. కం॥ జన్మంబునకును బీజము।
కర్మంబేగాని వెరె సాధనము।
రయ్యన్గన లేదీ ధరలోపల।
గాదనుటకుగారణంబు గలుగవదీశా॥

14. కం॥ కర్మంబనగా నేమిటి।
దెవ్విధమున గలుగుచుండు నేరుపడంగా।
నవ్విధము దెలియ కను।
దుర్మదములు సమసిబోవు దురితవిదూరా॥

15. గీ॥ ఆదిమధ్యాంత శూన్యమై యఖిలవస్తు।
సముదయంబుల ఘగార్ణ భావంబుతోడ।
నిండియుండెడు సద్వస్తుసన్నిధాన।
బలముచేతను బుట్టెననాదిమాయా॥

16. కం. సూర్యుడు బుట్టిన దమతమ।
కార్యంబులు జేయుజగము కరణినితేజి।
స్తోమంబున దెలివొందియు।
కాలముకర్మంబనంగ గణనంబాయెన్॥

17. మ॥ కాలమునాశ్రయించి, దగ కార్యము నెప్పను,
నెప్పకుండెడుకి । కాలముదానవచ్చునది రమ్మ
నివేడినగానిరాదు। తత్కాలము కర్మ ఫలమగు,
కర్మముజన్మకు సాధనంబగున్ । జన్మముబంధ
మోక్షముల, కాస్పదమైవనరారునిమ్మహిన్॥

18. కం॥ కర్మముల విధము లెన్నను।
నెవ్వరికిని దరముగాదు ఇమ్మహిలోనన్।
కర్మముగ హనముగతియని।
ధర్మజ్ఞులు జెప్పబడిరినిర్మలచరితా॥

19. కం॥ కర్మమె సుఖములనిచ్చును।
కర్మమెదుఃఖములనిచ్చు కాలమువలనన్ ।
కర్మము కాలము గూడిన।
ధర్మము కార్యంబులౌను ధరజీవులకున్॥

20. కం॥ కర్మంబు రెండువిధములు।
సత్తనగా బరగినొకటి సత్కర్మయగున్।
దుర్విషయాసత్తనగను।
బరగును మరియొకటి దుష్టకర్మంబనగా॥

21. గీ॥ దుష్టకర్మలనగ దూరుట కొట్టుట।
కౌంగిలించిమనుట రంకులాట।
కష్టబెట్టి బరులధనములుగోరుట।
తప్పుసాక్షిజనుట త్రాగిబడుట॥

22. కం॥ స్త్రీహత్యయు శిశుహత్యయు।
నరహత్యయు నాత్మహత్యనమ్మినవారిన్।
వెసమోసబుచ్చి పెద్దల।
నవమానము బొదలు దుష్టకర్మములనఘా॥

23. గీ॥ తప్పుపనులు నొకడుతరుచుగా జేయుచు।
తెలియలేరటంచు దెలియనన్న।
మనసుమనను నెరిగి మేలిమైయుండంగ।
వేరెసాక్షులేల వారిజాక్ష॥

24 కం॥ తమతప్పులు దామెరుగక।
నితరులకును నీతిజెప్ప నేర్పరిజెనులన్।
శమనుండుజూచి నవ్వును।
యిదిదుష్టపు కర్మమనుచునీరజనాభా॥

25. కం॥ అధికారము నైశ్వర్యము।
బలవత్తరమైనవిద్యాబలమున బరులన్।
అధములుగా తమమదిలో।
గనుగొనుటయు దుష్టకర్మకారణమనఘా॥

26. గీ॥ దుష్టకర్మలనేకముల్ ధరణియందు।
నష్టకష్టాదినిష్ఠుర నెలవునిదియె।
గట్టిగా కామక్రోధనివాసమిదియే।
నిదియెయశుభంబు నరకనివాసమిటయే॥

27. గీ॥ గానమనుజులు దుష్కర్మ మానవలయు।
జ్ఞానమును బూని సత్కర్మ జేయవలయు।
దానసకలశుభంబులు ధర్మములును।
బొందిగందురు నిందిరారమణు పొందు॥

28. గీ॥ గర్వరహితులు సద్గుణగ్రహణనిధులు।
సర్వదానేక సత్కార్యనిపుణమతులు।
నిర్మలాత్మను స్థైర్య నీతిమతులు।
సర్వభూతసుహృత్తులు సత్కర్మరతులు॥

29. కం॥ ఇష్టాపూర్తంబులు మరి।
స్పష్టంబుగ జేయవలయు సుగుణుల కెఱుగన్।
పాత్రాపాత్రము నెఱిగియు।
దానంబులు జేయువాడు ధన్యతనొందున్॥

30. గీ॥ సత్యవాక్యంబుచేతను స్వర్గమొదవు।
నిత్యసద్గోష్ఠి చేకడు నిర్మలుడగు।
ధర్మగుణమున దురితముల్ దగులకుండు।
ప్రత్యయంబులు బుట్టును ప్రాజ్ఞునకును॥

31. గీ॥ ప్రాజ్ఞుడనగను సత్కీర్తిభాగ్యుడరయ।
యోగ్యమగుకీర్తిదానిచ్చు నిహముబరము।
త్యాజ్యమగుకీర్తిగలవాడు బుడమిరొందు।
బుట్టిజచ్చియుఫలమేమి భోగిశయనా॥

32. కం॥ ఐబుకీర్తి మంతునందరు।
వివిధంబుగబొగడగలరు సర్వరలోకన్।
వలసిన వారికి నిష్టము।
బెట్టగనేకీర్తిరాదు ప్రభువులకైనన్॥

33. గీ॥ చదువులేనిబుద్ధి సార్థక్యమొందదు।
ఊటలేనిబావి సాటిగాను।
బుద్ధిలేనిచదువు వ్యర్థమైపోవును।
జ్ఞానవృత్తిభక్తి శ్రీరమణుగను॥

34. కం॥ చదివిన వాడైనందుకు।
సదసత్తులజాడలెరిగి చాలినకొంది।
న్మదినిర్మలంబుజేసియు।
ముదమూనబరహితముకొరకు మూర్ఖానవలయున్॥

35. కం॥ యుక్తాయుక్తంబెఱిగియు॥
సార్థకమగుపనులుజేయు జాణుండెవుడుఁ।
యుక్తియు శక్తియుగలిగియు।
వ్యర్థుండై కృపణుఁడుండుకూర్మముభంగిఁ॥

36. గీ॥ జన్మమెత్తినవాడు సత్కర్మమునకు।
శక్తికొలది ప్రయత్నముల్ జేయవలయు।
నమ్మదగినదిగాదు దేహమ్ముముమ్ము।
కమ్ముకొనిజేయనోపదు గలుగుమతులు॥

37. గీ॥ జన్మసార్థకంబు జేయగోరినవాడు।
దుర్గుణంబులన్నియు ద్రుంచివేసి।
మర్మమెఱిగిగురుని మార్గంబుమదినుంచి।
పరమునెంచిదివ్య పదముగాంచుఁ॥

38. కం॥ అంతఃకరణము కారణ।
మంచితముగనన్నిటికిని నరులకుమరియుఁ।
మంతనమున చింతనచే।
నంతయు గలిగుండుదాననైర్మల్యమొడలఁ॥

39. కం॥ అంతఃకరణాదీంద్రియ।
బృందంబులకెల్లసాక్షి భూతుండగుచున్।
అంతటను నిండియుండెదు।
సర్వాంతర్యామినైన స్వామినుతింతున్॥

40. గీ॥ దివ్యమంగళవిగ్రహ ధారియగుచు।
భవ్యకల్యాణ సుగుణాభిరాముడగుచు।
సేవనీయ్యజనాభీష్ట దాయుడగుచు।
నొప్పుచుండెడిమూర్తి నే నభినుతింతు॥

41. కం॥ ప్రారబ్ధకర్మ వశమున।
నీదేహముగలిగెనాకు నీశ్వరయిపుడున్॥
క్రూరంబగు ప్రారబ్ధము।
ననుభవమునగానిపోదు నరనుతచరితా॥

42. కం॥ సంసార వార్ధిలోకడు।
హింసలుయనునలలచే దు నీదుమతరుణో।
పాయంబు దారిదెలియక।
కడకటినీప నెడుదీవి గంటినితంద్రీ॥

43. కం॥ కింకర సంకట హరణా।
యెఘునైనాఁ ప్రోవవయ్యయిందిరరమణా।
అంకితముఁజూడ నిచ్చియు।
సంకోచము మదిలోమాన్పి పంకజనయనా॥

44. కం॥ ఘన్నుతుఁడగు నినుఁబొగడను।
చెన్నలరగనాకుదరమె సన్నుతచరితా।
మన్నించి కరుణ జూడుము।
విన్నపములునాలకించి పన్నగశయనా॥

45. కం॥ నిను సైంచను నారదుఁడా।
శుభచరితుండైన శుకుఁడ శౌనకమునివా।
వినువెనుక నరమనుజుఁడ।
తడయిక ననుఁ బ్రోవనీకుఁ దప్పదధీశా॥

46. కం॥ పతితుండని విడనాడకు।
సతతంబును నీదునామ సంస్మరణముచే।
విశదముగనమ్మినాఁడను।
పరమాత్మానీవుపతిత పావనుఁడుగదే॥

47. కం॥ గతినీవని ప్రతిమాలితి।
నుతిశేయను నేర్పు లేదు నీరజనాభా।
మతిలోన నిల్చి నీదగు।
స్తుతిభావము దెల్పవయ్య శ్రీరామయ్యా॥

48. కం॥ దీనాభయదాయకుడని।
నీనామంబనుదినంబు చింతించికడున్।
దీనుడనై మహిలోనిపు।
సాధన మెరుగంగలేను సాధుశరణ్యా॥

49. కం॥ ఇమ్మహి నీస్మరణంబను।
కమ్మనిరుచి గనినరసన నమ్మనెనితరం।
బిమ్ముగ దేనియ దేయగోరి లెడు।
తుమ్మెదనుమ్మత్తికాయ దినగన్ జనునే॥

50. కం॥ గోవింద హరిముకుందా।
జీవనమును నీవేనాకు భావములోనన్
రావిందు శ్రీరమాపతే।
రాజీవదళాక్ష భక్తరక్షణదీక్షా॥

51. కం॥ దామోదర సంకర్షణ।
సామజరిపుహరణ సర్వసంకటహరణా।
కామాదిశత్రువర్గ స్తో।
మంబులబాధమాన్పి బ్రోవుముకుందా॥

52. కం॥ నారాయణ నరపోషణ।
నీరానినునమ్మినాడ దీనదయాళో।
రారానా మొరవినరా।
కోరానామనసునిపుడు గోపాలహరీ॥

53. కం॥ విశ్వాదివిశ్వవేద్య।
విశ్వేశ్వరవిశ్వరూప విహారాద్గమన।
విశ్వోదర విశ్వంభర।
శాశ్వతనిజ తత్వరూప చాతుర్యనిధీ॥

54. కం॥ సురజ్యేష్ఠత్వము సృష్టికి।
నురచిరస్థితి కార్యమందు శ్రీనాథుడవై।
విలయంబుజేయరుద్రుడ।
వనజుంగిన నీకొనర్తు వందనశతముల్॥

55. కం॥ త్రిగుణాతీతుండవుమరి।
సగుణుండవు నిర్గుణుండవు సర్వేశ హరీ।
జగదంతరాత్మవగుచును।
వెలుపలలోపలనునిండి యుందువధీశా॥

56. కం॥ ఘటపటములకును మన్నెటువలె।
మృత్తంతులు కారణంబొనటువలె నీవున్।
బహుతరముగ జగములకును।
దిటువగు కారణముగాద దీనదయాళో॥

57. కం॥ అంజనివరసుత వందిత।
కుంజరవరిపాల శీలురంజితనీలున్।
సంజనితమిత్రవంశజు।
కంజాతభవాది వినుతు మంజుళచరితున్॥

58. కం. శ్రీమాధవ దామోదర।
నారాయణపద్మనాభ నళినదళాక్ష।
భూమీనుత ప్రేమాస్పద।
ధామారిణరంగభీమ దశరథరామా॥

59. కం॥ నరసింహా హరిముకుందా।
పురుషోత్తమ పద్మనాభ భువనాధారా।
నరసురసేవితసీరుద సరసిజములె।
దిక్కునాకు సన్నుతచరితా॥

60. గీ॥ రామకృష్ణశౌరి రంగమందిరవాస।
కామజనక భక్త కలుషహరణ।
నామసంబునందు నెలకొనిప్రేముము।
కామితంబులిచ్చి కరుణతోడ॥

61. చ॥ అవైకుంఠపురాధి నాథనిను నర్థిఁ గీర్తనల్ జే
యవాకీ। నానీయడ భక్తలోక హృదయాభీష్ట
ప్రదానైక భాసురది । వ్యర్థనకీర్తిమూర్తి గని
యుండఁగ । లోకమందంటునఁగానిని। కరుణించు
ముగాదు విన్నపము విశ్వాత్మవిరాడ్విగ్రహా॥

62. కం॥ దీనుని మొరయాలించుము।
శ్రీరమణానీవెడ కుక్క దాసులకెల్లన్।
వీనుల బడెనో లేదో।
యేమో నా ప్రాణఫలము వేంకటరమణా॥

63. కం। వటపత్రశాయివగుచును।
తటుకున నీసృష్టి జగములన్ని గూనీలో।
మటుమాయముగా జేయుచు।
విశదంబుగ వెలుగునీకు నిదేవందనముల్।

64. కం। సకలాంతరాత్ముడనగను
ప్రకటంబుగ బొగడచుండు బ్రహ్మంబగునీ।
యకలంకంబగు మహిమము।
నికరంబుగ నెరుగలేరు నెవ్వరుమహిలోన్।

65. కం। సర్వజ్ఞ సర్వతోముఖ।
సర్వేశ్వర సర్వసాక్షి సర్వాతీతా।
సర్వప్రియ సర్వప్రద।
సర్వోపనిషద సారసన్నుతసీలా।

66. కం। నాదప్రియనారాయణ।
వేదోద్ధరవిబుధవంద్య విశ్వాకారా।
మోదప్రమోదదర్శన।
సాధుజనానంద భరిత సన్నుతచరితా।

67. కం। శ్రీమాధవ దామోదర।
కామితఫలదానశీల కమలాలోలా।
రామారంజితనామా।
యేమినావ్రాతఫలము నేర్పడజపుమా।

68. ఉ. మంగళ దేవతాన్వితుడ। తుంగతరంబగు నీదుభక్తి
నాడెందమునందునిల్పినిఘు। చంచలధర్మములన్ని
మాన్పి। శృంగారము మించునీదు కరుణా। మృత
పానముగల్గచేసి। నేసారక నేగబోవ్రుమిఘు। యో
గిశరణ్యవరేణ్య మాధవా॥

69. కం. సురుపక నీమహిమంబులు।
నహరహమును బొగడునటుల నతిశయబుద్ధిన్
గరుణించిగలుగజేయుము।
నిరుపమగుణ జాలశీల నిందిరలోలా.

70. కం. జననంబొందిన జీవులు।
దినదినమును వృద్ధిబొంట జూచుచునుండన్।
వెనవెనక ననుసరించును।
తనువులునెడబాసిబోవు సమయంబనఘా.

71. గీ. ఇచటనార్జింప బడినట్టివిత్తములలో।
సచ్చమగుపుణ్య పాపముల్ వొచ్చుగాని।
నిలవనొకకాసైన తనుతోడ రాదటంచు।
తెలిసియున్నను తృష్ణతన్నెరుఁగనియదూ.

72. గీ. పాంచభౌతిక మాయమ్మునై ప్రబలుచున్న।
నీప్రపంచంబునందు నీవున్నకతన।
గాదేతనుతిమకార్యముల్ గనుటనుప్ప।
నీవు లేకుండు కాలంబునెపుడు లేదూ.

73. కం దేవుడుసర్వమయుండని।
భావములో తెలియలేని భక్తులుదమలో।
సోమారితనమువానియు।
వేమరుసీను బొగడివిద్య వినమితమతులై.

74. గీ. విద్యచేతను విజ్ఞానముదయమౌను।
జ్ఞానమున ప్రజ్ఞ ప్రబలమై బోధనిచ్చు।
బోధమనిశంబుగల్గిన నాత్మయొందు।
నైక్యభావంబు జెందినా నందమొందు.

75. గీ. నైక్యమనఁగ నేమి నగుననిసందేహ।
మొదిగ నేనివినుఁడు సుజనులార।
నైగు ణమయమూని నిర్మలంబగునేని।
నాదిదేవునందు విలయమొందు.

76. గీ. దర్పణంబునందు దగఁదోచినముఖంబు।
దర్పణంబునష్టమైనయపుడు।
తనముఖంబునందు దగఁజేరినైక్యంబు।
జెందనటుల జీవి బ్రంహ్మజెందు.

77. గీ. బ్రంహ్మమిట్టిదనుచు బల్కంగవరదాన।
యచటుధూమమున్ననచటనగ్ని।
యున్నదనినెరుంగు చందాన తేజంబు।
లన్ని బంహ్మమై వెలుఁగుచుండు.

78. కం. అమృతుండజరుండక్షరు డక్షీణుండ
జుడనాదియవ్యయుడ మరుండక్షయ
ఫలదాయకుడగు।
మోక్షకుండైన నభవు నేఁడుతియింతుౝ.

79. కం. నారాయణుడని భవుడని।
వారిజసంభవుడటంచు వివిధగతులతో।
వారాహిముఖ-గణపతి।
యాదిత్యుండనుచు నిన్ను గొల్తురనేకుల్.

80. చ. మతములు నేర్పరించుకొని మానుగనిన్న
ననేకబంగులన్।
సతతముపూజసల్పుదురు సాధువులయిన
మహాత్ములిద్దరన్।
అతులితమయిన నీదుమహిమంబిటులందరి
కన్నిరూపులై।
సతతము వాననీళ్ళుపడిగా నదిరూపములయి
సముద్రమున్।
తలుకున జెందునైక్యపడిని జెందునునిన్ను ననూన
సంపదన్.

81. గీ. నిన్ను బూజించువారికి నిక్కముగను।
మానవులయును కామక్రోధములు మొదట।
నన్నుతాకారనటుగానివారిపూజ।
నిన్ను జెందదు నిజమిది నిర్మలాత్మ.

82. కం. నీదయఁగోరినవారలు।
మోదముతో తత్త్వమార్గ మెల్లను దమలో।
శోధించిజూచి మెల్లన।
ధీసనములు పదిలపరచి దృఢతరభక్తిన్.

83. చ వినుఁడువిరాట్టునందు దగవిశ్వుని జేరిచి
నిశ్చయంబుగన్।
వెనక హిరణ్యగర్భునకు తేజను జేర్చుచు నేర్పు
మీరఁగన్।
కనుగొని ప్రాజ్ఞుచేర్పనగు మోదముతో గురు
నాజ్ఞచే,।
తనవాక్కృతునందు జెంతగనగందురు సర్వ
సమత్వసంపదన్.

84. గీ. విజ్ఞానభూమిక విపరంబులేదును।
దెలసి సుజ్ఞానసంబు దేటపడగ।
ప్రజ్ఞ సౌజ్ఞదాల్చి బ్రహ్మతత్పరుఁడునై।
భక్తిచేత వాడుముక్తిజెందు.

85. గీ. బద్ధపద్మాసనస్థులై యోగివరులు।
రేచపూరక కుంబకోద్భూతసరణి।
శుద్ధపరమాత్మ భావసంసిద్ధికొరకు।
నిన్ను ధ్యానింతు రెప్పుడు నిర్మలాత్మ.

86. కం. దృక్ దృశ్య విలక్షణుడై।
దృశ్యంబులకాదియగుచు దృక్కులలోనన్
విగ్రహములకళను జెందుచు।
నగ్రచరుండైన నిన్ను నేనుతియింతున్.

87. చ. పరమదయానిధే పతితపావన నామ।
నీకాలకించరా నిరతము నీమహా।
మహిమ నెన్నుచు నున్ననేక భక్తులన్।
ధరణిలో నీవు బ్రోచినది తప్పకనిశ్చయ
మాయనేని। వేగిరముగ నన్ను బ్రోవుమరి
యోగిశరణ్య వరేణ్యమాధవా.

88. కం. కలడా నీసరిదైవము
వరదానాపాలిదేవ వారిజనాభా।
కలకాలమిటుల కటుల్పగ
వ్యథబెట్టుట హితువేనీకు నినకులతిలకా.

89. కం. నిగమాంతవేద్య నీదగు।

నగుమొము నను జూచుకున్న నిపుణోర్వ్యనుమీ।

వగలేల వేగరారా।

ఖగవాహనాదిదేవ కరుణాజలధే.

90. కం. శ్రీమాధవ శ్రీ రాఘవ।

దామోదర పద్మనాభ ధర్మాధారా।

వీరాదివీర నీదగు।

శరణమెగతి వేరలేదు సన్నుతచరితా.

91. చ. నీచరితంబులద్భుతము లెన్నగ శేషునకైన శక్యమా।
శ్రీశపరేశ యీశభవపాశసమూహ వినాశ కేశ
వా। వానికిందు సంస్మరణ దోషములన్నియు బా
పకుందునే। పూషణకాంతి చేనిలువనోపునె ద్వాం
తసమూహ మెక్కుడున్.

92 చ. శ్రీదామోదర పద్మనాభహరిరామా।
కృష్ణశార్ఙ్గీ జనార్దన సంకర్షణ। సర్వతోము
ఖకురారెవిష్ణు శ్రీవామనా నరసింహాచ్యుత। వా
సుదేవ వరరాజీవాక్షవిశ్వోదరా। ధరలోనీసరి
దాతలెవ్వరిఘు రామా వేగరక్షించుమా.

93. మ. సనకాదిస్తుతి శేవ్యమై। శివశక్త్యానందావిహృద్భా
వ్యమై। పరమార్థ ప్రతిపాద్యమై భువిరాజద్విష్ణుస
న్మూర్తియై। బొలుపొందగా జగముల్ సృజింప
బెనుపగ క్షీణింపగా లాకృతిన్। వరుసన్ సర్వ
ముతన్మయంబగుచు క్రీడన్ జెందు సర్వాత్మునిన్
శరణంబొందితి దేవనీదు దయ రామా వేగ
రక్షింపుమా.

94. గీ. చిన్ననాటనుండి చింతించి చింతించి।
ముదిమి సంభవించె తనువుకిపుడు।
పన్నగేంద్రశయన పాలించుమీఘనమైన।
భక్తపారిజాత భవ్యచరితా.

95. గీ. వేదశాస్త్రపురాణముల్ జోరుకొనగ।
మదిలో నీభక్తి భావన పదిలపరచి।
విశదముగ సర్వధర్మముల్ వదలి నీదు।
శరణమును బొందినానయ్య చల్లనయ్యా.

96\. కం. భవబంధసమూహంబుల।
మొదలంటను ద్రుంచిశాంత మయమునుమదిలో,
నివసింప జేసి బ్రోవుము।
కరుణాకర పరమపురుష కారణవేషా.

97\. కం. దినదినమును మదిలోనినున్।
మరుపక బొగడంగఁగలుగు మహనీయ్యులిలన్।
జననము మరణము లేకను।
నివసింతురునీదుదివ్య నిలయము నందున్।

98\. కం. మననాదుల సుర్మంబులు।
సలలితముగ జేసినీదు సేవయు జేయం।
జననిమ్ము వేగిరమ్ముగ।
వరగురుగుహధామరామ వేంకటనాథా॥

99\. కం. పరమాత్మ నీదుభజనము।
పరిపూర్ణుల జేయునధిక పాపులనైనన్।
వెరవేలత్రి రమాపతే।
నినునమ్మినదాసులకును సర్వ లోనన్.

100. గీ. భవ్యతరమైనని దివ్యకీర్తనములు।
భక్తజనకల్పతరువులై భువిచెలంగు।
సత్యశుభవాక్యమిదియని భక్తవరులు।
భక్తిచేముక్తిగన్న విరక్తులగుచు.

101. కం. యక్కడజూచిన నీదగు।
జక్కనితేజంబెగాని ధారుణిలోనన్
జుక్కలు సూర్యాదు మొదలుగ।
నిక్కంబుగ నీవెగాని నితరములగునే.

102. గీ. సాధుజనులకెల్ల జీవనోపాయంబు।
నీదుభక్తిగాని వేరలేదు।
వామలేలదే ఫలస్నియముమాన్పి।
మోదరసమొసంగి యాదరించు.

103. గీ. ఇంతవాడవనుచు నిన్నెటులెంతునే।
నంతనీవెబాడ వింతనీవె।
సంతతంబువెలుగు సర్వసాక్షియునీవె। .
మంతనంబునందు మర్మమీవే.

104. గీ. పగులురేయిజేయు పరమాత్ముడవునీవె।
పగలగుల్కుముద్దు పలపునీవె।
మగుంతగులజేయు మర్మకర్మములీవె।
పరయుపదవినిచ్చు ప్రభుడవీవే.

105. కం. ఈన్నివిధంబుల జూచిన।
యున్నతుఁడగు దేవదేవుడేర్పడగానకు న్న।
న్నిశుభంబుల నొసగియు।
నరుదుగత్రాణకరుడు బ్రోచు నాశ్రితజనులన్.

106. కం. భక్తుల బ్రోచెడి కొరకై।
రక్తితో ధరజన్మమెత్తె రాముండగన్।
ముక్తినిగోరెడు వారలు।
భక్తితో భజియింపనగును బహువిధముగన్.

107. గీ. సర్వభూతదయయు శాంతచిత్తంబును।
నిర్మలంబుమరియు నిత్యతృప్తి।
గర్వనాశనంబు గాఢవైరాగ్యంబు।
కలుగజేసి బ్రోవుగురుడగమనా.

108. గీ. రఘుకులాబ్ధిసోమ రఘురామ జయరామ।
భక్తజనను సేవ్య భవ్యనామ।
చిగురు తుళసిదామ సీతామనోధామ।
చిత్తగించి బ్రోవు భక్తప్రేమా.

109. గీ. అష్టోత్తర శతపద్యము।
లాత్మనందాభిధాన వర్యునిచేతఁ।
స్పష్టముగ నుతువఁబడె।
శ్రేష్ఠులువినిచదివి బ్రంహ్మనిష్ఠగనుటకై।

సంపూర్ణము.



